# ప్రజా విద్యా విధానము
# ఉపాధ్యాయుల కర్తవ్యం

రచన
కంతంనేని చలపతిరావు [illegible]

★

ప్రజాశక్తి ప్రచురణాలయం
బెజవాడ

నేడు దేశంలో దాదాపు అన్ని రాష్ట్రాలలోను ఉపాధ్యాయులు ప్రత్యక్ష చర్యకు దిగుతున్నారు. తరతరాల దాస్య నిద్రనుంచి మేల్కాంచి ఉపాధ్యాయులు తమ హక్కుల సాధనకు పోరాటమే మార్గమని గుర్తించారు.

ఢిల్లీలో 5 వేల మంది సమ్మె చేశారు. బొంబాయిలో 54 రోజుల పాటు సమ్మెగావించారు. మధ్యరాష్ట్రాలలో 16 వేలమంది సమ్మె చేశారు. కొంతమంది జైళ్ళకుకూడ వెళ్ళారు. బెంగాలు రాష్ట్రంలో 1,20,000 మంది ఉపాధ్యాయులు తమ హక్కులను ప్రభుత్వం గుర్తించకపోతే ప్రత్యక్షచర్యకు పూనుకోవాలని నిర్ణయించారు. ఇదే పరిస్థితులు సింధు, పంజాబు, యు. పి. మొదలగు రాష్ట్రాలలో వున్నట్లు వార్తలువస్తున్నాయి.

మన ఆంధ్రరాష్ట్రంలో ప్రత్యక్ష చర్యకు కొన్నిప్రాంతాలలో దిగారు. గుంటూరు హిందూ హైస్కూలు ఉపాధ్యాయులు జీతాల పెంపుదలకొరకు కొన్నిరోజులపాటు బైఠాయింపు సమ్మె చేశారు. కృష్ణాజిల్లా హైస్కూలు ప్రాథమికోపాధ్యాయులు షుమారు 6 వేలమంది తమ కోర్కెలను ప్రభుత్వము అంగీకరించకపోతే ప్రత్యక్ష చర్యకు దిగాలని తీర్మానించారు

నిన్న మొన్నటివరకు విద్యార్థులు తమ కోర్కెలకొరకు సమ్మెలు చేస్తూ ఉంటే ద్వేషభావము వహించి సమ్మెలను అసహ్యించుకొనే ఉపాధ్యాయులు నేడు తామే సమ్మె ఆయుధాన్ని చేపట్టారంటే అందరినీ ఆశ్చర్య పరుస్తుంది.

అయితే నేడు ఉపాధ్యాయులుకూడ యిట్టి మార్గాలు అవలంబిస్తున్నారంటే యేవో కొన్ని అసాధారణ పరిస్థితులుండాలి.

## నూతన చైతన్య వెల్లువ

రెండు వందల సంవత్సరాల బ్రిటిషు సామ్రాజ్యవాదుల దోపిడీ పరిపాలనా ఫలితంగా దేశం అంతా శల్యావశిష్టమై పోయింది. ఆర్థిక విధానమంతా క్రుళ్ళిపోయింది. కరువు కాటకాలు దేశానికి మామూలై పోయినవి. యుద్ధంతో పరిస్థితులు మరింత విషమించాయి. వస్తువుల

ధరలు విపరీతంగా పెరిగి ప్రజలకు అందుబాటులో లేకుండా పోయాయి. జీవిత ప్రమాణం నాలుగు, ఐదురెట్లు పెరిగింది. ప్రజాజీవితమే దుస్సహమై పోయింది.

యుద్ధానికి పూర్వమే ఉపాధ్యాయుల జీతాలు చాలా తక్కువ. బజారులో తట్టమోతకూలీ ఆర్జనకంటె ప్రాథమికోపాధ్యాయుని జీతము యేమీ ఎక్కువగాదు. యుద్ధమువచ్చి జీవిత ప్రమాణం పెరిగిపోవడంతో ఉపాధ్యాయుని బ్రతుకే దుర్భరమైనది. జీతాలుమాత్రం పెంపుదలలేదు. జీవితం నరకప్రాయ మయినది. ఇట్టి దుర్భర పరిస్థితులనుండి విముక్తి పొందుటకు కొందరు ఆత్మహత్యయే శరణ్యముగా భావించారంటే ఆశ్చర్య మేముంది.

బొంబాయి రాష్ట్రములో నగర్ జిల్లాలో 18 మంది ప్రాథమికోపాధ్యాయులు కుటుంబాలను పోషించుకోలేక ఆత్మహత్య చేసుకున్నారు. హుబ్లీలో 8 మంది పరిస్థితులను తట్టుకోలేక పిచ్చివారై పోయారు. చెప్పాలంటే యిట్టి ఘటనలు అనేకమున్నాయి.

నెలకు రు 15 లు జీతంతో తా నెలా జీవించగలుగుతాడు? కుటుంబాన్నెలా పోషించుకోగలుగుతాడు? ఎండుడొక్కలతో తన వృత్తి ధర్మాన్ని యెలా నిర్వహించగలుగుతాడు? ఎన్నాళ్ళు పొట్టగడవని జీతంతో నికృష్ట జీవితాన్ని గడపగల్గుతాడు?

ఈ దుర్భర పరిస్థితులకు లోబడి మృత్యువాతబడుటా? లేక సౌఖ్యప్రదమయిన జీవితంకొరకు తెగించి పోరాడుటా? దేశ వ్యాపితంగా ఉపాధ్యాయవర్గాన్ని నేడీ సమస్య యెదుర్కొంటున్నది.

దేశములో కార్మికులు, కర్షకులు, తమను పీల్చి పిప్పిజేసే దోపిడీ పరిస్థితులకు వ్యతిరేకంగా వీరోచితంగా పోరాటాలు జరిపి వివిధంగా తమ హక్కులను సాధించుకొంటున్నదీ ఉపాధ్యాయులు కళ్ళారాచూచారు. అంతేగాదు. తమ కళ్ళముందు పుట్టి పెరిగే, విద్యార్థులు బానిస విద్యావిధానానికి వ్యతిరేకంగా గావించే వీరోచిత పోరాటాల ఫలితాలను స్వయంగా చూడగలిగారు. తరతరాలుగా జీర్ణించియున్న దాస్యభావాలకు స్వస్తిచెప్పి తాముగూడ పోరాటమార్గాన్ని నడువసాగారు.

బ్రిటిషు సామ్రాజ్యవాదం యీనాడు అన్ని వర్గాల విశ్వాసాన్ని కోల్పోయి అందరికీ దూరమవుతూంది. కార్మికులు, కర్షకులు, విద్యార్థులు

యువకులు, గుమస్తాలు అంతా సౌఖ్యప్రదమైన నూతనజీవితాన్ని నిర్మించు కొనటానికి సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుచున్నారు. ఉపాధ్యాయుల పోరాటంగూడ అట్టిదే.

దేశంలో సామ్రాజ్యవాదులు నెలకొల్పిన సామాజిక వ్యవస్థ ఏవిధంగా కుళ్ళిపోయిందో ప్రజలంతా నూతన జీవిత నిర్మాణంకొరకు ఏవిధంగా తహతహలాడుచున్నదీ స్పష్టపరుచుటకు దేశవ్యాపితంగా వచ్చే ఈ ఉపాధ్యాయుల పోరాటాలు ఒక కొలతబద్ద. యుద్ధానంతరం దేశంలో వ్యాపించే నూతన చైతన్య వెల్లువకివొక నిదర్శనం.

## సామ్రాజ్యవాద విద్యావిధానము, ఉపాధ్యాయుని స్థితి

ప్రభుత్వ ఆశయాలనుబట్టే విద్యావిధానంఉంటుంది. ప్రజాస్వామ్య ప్రభుత్వం, విద్యావిధానంద్వారా ప్రజాస్వామిక భావాలు వర్ధిల్లేటట్లు ప్రయత్నిస్తుంది. మానవుని సర్వతోముఖ వికాసానికి కృషిగావిస్తుంది. సామ్రాజ్యవాద ఆశయాలు అందుకు పూర్తిగా భిన్నమయినవి. ప్రజలలో ప్రజాస్వామ్యభావాలు అభివృద్ధిచెందుటను సహించజాలదు. ప్రజల విద్యా విజ్ఞానాలు పెంపొందకుండా అరికట్టుటకు కృషిచేస్తుంది. ప్రజల అజ్ఞాన అవిద్యలే సామ్రాజ్యవాదానికి పునాదులు. అందుచే సామ్రాజ్యవాదులు వలస రాజ్యాలలో తమ దోపిడీవిధానాన్ని సుస్థిరంచేసుకొనటానికి విద్యాభివృద్ధిని ఒక వైపున అరికట్టుతూ మరొకవైపున తమ అవసరాలను తీర్చుకొనటానికి ప్రయత్నిస్తారు. విద్యాలయాలద్వారా బానిస భావాలు వ్యాపింపజేస్తూ ప్రభుత్వ యంత్రానికి సరిపడ సిబ్బందిని తయారుచేసుకొనటానికి ప్రయత్నిస్తారు.

మెకాలే, సామ్రాజ్యవాద ఆశయాలతోనే విద్యావిధానానికి పునాదులు వేశాడు. ప్రభుత్వ నిర్వహణకు సరిపడు గుమాస్తాలను తయారుచేయుటకే విద్యావిధానాన్ని నిర్మించాడు.

ప్రజల కనీస అవసరాలైన తిండి, బట్టావలెనే ప్రాథమిక విద్య కూడ ప్రజల కనీస అవసరం. తిండీ, బట్టా సమస్యలయెడ ప్రభుత్వం ఎంత శ్రద్ధచూపెట్టిందో ప్రాథమిక విద్యమీదకూడ అంతే ఆదరణ చూపెట్టింది. ఈనాడు ప్రతి నాగరిక ప్రభుత్వం నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టి ప్రజల విజ్ఞానాభివృద్ధికి కృషిచేయుట పరిపాటైంది. ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికా మొదలైన దేశాలలో నూటికి 80 మంది, సోవియట్

యూనియన్‌లో నూటికి నూరుమంది చదువుకున్నారు. కాని సామ్రాజ్యవాద ప్రభుత్వం మనదేశంలో నిర్బంధ ప్రాథమిక విద్యను అరికట్టుటకు అనేక ప్రయత్నాలుచేస్తూ వచ్చింది. దాని ఫలితంగానే నేడు మనదేశంలో నూటికి 10 మందికంటె ఎక్కువ చదువుకున్నవారులేరు. బ్రిటిషుసామ్రాజ్యవాదం ప్రజల విద్యాభివృద్ధియెడ ఎటువంటి సవతి తల్లిప్రేమ వహించిందో, ఉపాధ్యాయులయెడకూడ అటువంటి దృక్పథాన్నే ప్రదర్శించింది.

విద్యాలయాలన్నీ, బానిస భావాలను ప్రబోధించుటకు కేంద్రాలుగా వుంటూ వచ్చాయి. బానిసలను తయారుచేయుటకు, నియమింపబడిన బానిసలుగానే ఉపాధ్యాయులను చూస్తూ వచ్చింది. ఉపాధ్యాయులకు తగినంత వేతనాలుగాని, ప్రోత్సాహంగాని లేవు. స్వాతంత్ర్య భావాలు అభివృద్ధి కాకుండా అనేక ఆటంకాలు కల్పించుతూ వచ్చింది. దీని ఫలితంగా, నేడు పాఠశాలలో విద్యార్థుల సంఖ్య హెచ్చుతూ వుంటే. తగినంతమంది ఉపాధ్యాయులులేక, స్కూళ్ళు నడచుటలేదు. కారణం ప్రభుత్వ నిరాదరణయే ఉపాధ్యాయుల వృత్తి స్వీకరిస్తే, జీవితం గడుస్తుందనే నమ్మకం, పోవుటతో, చదువుకున్నవారు ఇతర వృత్తుల లోనికి పోతున్నారు. దీనిఫలితంగా మన విద్యావిధానానికే తీవ్రమైన ముప్పు వాటిల్లింది. ఉపాధ్యాయులు, భావి పౌరులకు, విద్య గరపే మహాత్కార్యాన్ని సాగించుతున్నారు. విద్యార్థులకు వారు గరపే విద్యాశిక్షణలపైనే జాతి భవిష్యత్తు ఆధారపడి యున్నది. సామ్రాజ్యవాద ప్రభుత్వం విద్యాలయాల్లోకి, జాతీయ భావాలు చొరబడనీయకుండా ఉపాధ్యాయులలో స్వాతంత్ర భావాలు పెంపొందకుండా అనేక అడ్డంకులు పెట్టింద. విద్యాలయాల్లో దేశభక్తిని ప్రబోధించే మాటలు పలకరాదని, ఉపాధ్యాయులు జాతీయాభిమానం కల్గియుండుట మహాపరాధమని అనేక జి. ఓ లు తయారుచేసి, ఉపాధ్యాయులను ఉక్కుచట్టంలో బిగించింది.

దేశంలో ప్రజ్వరిల్లే జాతీయ చైతన్యం, ఉపాధ్యాయులలోకూడ, ప్రతిబింబించసాగింది. మలబారు ప్రాథమికోపాధ్యాయులు. 1939 లో తమ హక్కులకొరకు వీరోచితపోరాటంగావించారు. దీనితో ప్రభుత్వపు గుండె బెదరసాగింది. ఉపాధ్యాయ ఉద్యమం అభివృద్ధిగాకుండా, వేయి కళ్ళతో కనిపెట్టుతూ, వారిసంఘటిత శక్తిని, విచ్ఛిన్నం చేయుటకు, అనేక పద్ధతు లనుసరిస్తూ వచ్చింది.

1. చీల్చి పాలించుట

ఉపాధ్యాయులలో ఐక్యత పెంపొందకుండా ప్రభుత్వం ఉపాధ్యాయులను, వివిధ తరగతులుగా విభజించి, ఒక తరగతికంటె మరొక తరగతిని, ఎక్కువగా చూస్తున్నట్లు నటించి, ఒకతరగతి సాయంతో మరొక తరగతిని, దెబ్బకొట్టుటకు ప్రయత్నించింది. ఉపాధ్యాయుల అర్హతలు నిర్వహించే బాధ్యతలలో తేడాలు ఏమీలేక పోయినప్పటికీ, గవర్నమెంటు స్కూళ్ళల్లో అంతకంటె కొంతతక్కువగాను, ఎయిడెడ్ స్కూళ్ళల్లో అందరికంటె తక్కువగాను, జీతాలు నిర్ణయిస్తూ వచ్చింది. ప్రభుత్వం నిర్ణయించిన జీతాలు, ఎవ్వరికీప్రోత్సాహకరంగా లేకపోయినా, వచ్చేఅసంతృప్తిని తట్టుకోవడానికి కొందరిపై పెద్దచూపు చూసినట్లు నటించి వారిద్వారా ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయుటకు కుటిల యత్నాలను సాగిస్తూవచ్చింది.

2. సంఘాలపై నిషేధం

ఉపాధ్యాయులలో దినదినాభివృద్ధిజెందే సంఘ చైతన్యం తనకు ప్రమాదంగా వుందని ప్రభుత్వం గుర్తించి 1939 ఫిబ్రవరిలో రాష్ట్ర, జిల్లా ప్రాథమికోపాధ్యాయుల సంఘాలను నిషేధిస్తూ నెం. 416 జి. ఓ. ని జారీచేసింది. (నెం. 416, 417, 418 జి. ఓ. లు కూడ సంఘ నిషేధానికి సంబంధించినవే.)

3. విద్యాశాఖాధికార్లకు అంతులేని అధికారాలు

సామాన్యంగా ప్రతి దేశంలోనూ, ఇనస్పెక్టర్లు, ఉపాధ్యాయులకు బోధనాపద్ధతులలో తోడ్పడుతూ, విద్యాభివృద్ధికి సాయపడుతూవుంటారు, కాని సామ్రాజ్యవాదుల ఉద్దేశ్యంవేరు. ఉపాధ్యాయులపై తమ నిరంకుశ పెత్తనాన్ని సాగించుటకు ఇన్‌స్పెక్టర్లను ఉపయోగిస్తున్నారు. వీరిద్వారా ప్రభుత్వం ఉపాధ్యాయులలో స్వాతంత్ర్యభావాలు పెంపొందకుండా అడ్డు పడుతోంది. అందుకే ఇన్‌స్పెక్టర్లకు అంతులేని నిరంకుశాధికారాలు కట్టబెట్టింది. ఉదా : జి. ఓ నెం. 154 అటువంటిదే. దీని ప్రకారం ఉపాధ్యాయుడు తప్పుచేశాడనే నెపంతో అతని సర్టిఫికెటును రద్దుచేయవచ్చు. విద్యా శాఖాధికార్లు యీ ఆయుధాన్ని చేతులోపెట్టుకొని ఉపాధ్యాయుల గొంతుకలు తెగగోయటానికి వెనుదీయుటలేదు. స్వాతంత్ర్య

భావాలుగల ప్రతి ఉపాధ్యాయుడు ఈ అధికారానికి గురికావలసిందే. కష్టపడి చదివి సాధించుకున్న విద్యార్హతను ఒక్క కలంపోటుతో యీ విద్యాశాఖాధికార్లు రద్దుచేయగల్గుతున్నారు. స్వాతంత్ర్య భావాలు గలవారికి విద్యావిధానంలో తావులేకుండా చేయుటకే విద్యాశాఖాధికార్లకు ప్రభుత్వం ఇంతవరకులేని నిరంకుశాధికారాలను అంటగట్టుతోంది.

4. ప్రజల - ఉపాధ్యాయుల మధ్య అగాధం

పైన పేర్కొనబడిన నిరంకుశ అధికారులవల్ల ఉపాధ్యాయులు, ప్రజా జీవితానికి దూరంకావాల్సివస్తూ ప్రజల కష్ట సుఖాలతో సంబంధం లేకుండా ఉండవలసివచ్చారు. ప్రభుత్వ నిర్దాక్షిణ్య చట్టాలను భయపడి, రాజకీయాలకు దూరంగా ఉంటూవచ్చారు. దీనిఫలితంగా పీడిత ప్రజావుద్యమం, ఉపాధ్యాయుల ఉద్యమాలు [illegible] వేర్పడింది. ఉపాధ్యాయులను ప్రజలనుండి చీల్చి, తన దయాధర్మాలపై ఆధారపడేటట్లు ప్రభుత్వం ప్రయత్నించింది.

5. ఉపాధ్యాయులు - విద్యార్థుల మధ్య అగాధం :

విద్యాశాఖాధికారులను ఉపాధ్యాయులపై యేవిధంగా ప్రభుత్వం ప్రయోగించిందో, అదేవిధంగా ఉపాధ్యాయులను విద్యార్థుల్లో పొంగులెత్తే స్వాతంత్ర్యాభిలాషను అరికట్టుటకు ప్రయత్నించింది. బానిస విద్యా విధానానికి, డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాలను ఉపాధ్యాయులు సానుభూతితో అర్థం చేసుకోకుండా ద్వేషభావంతో చూడసాగారు. విద్యార్థులు - ఉపాధ్యాయులు ఒకే విధానంవల్ల బాధపడుచున్న సంగతి గుర్తించనందువల్ల విద్యార్థులు, ఉపాధ్యాయులమధ్య పెద్దఅఖాతం యేర్పడింది. సామ్రాజ్యవాద రథచక్రంలో మేకులుగావుంటూ వచ్చినందువల్లనే ఉపాధ్యాయులు బలిష్టమైన విద్యార్థి ఉద్యమాన్నుండి వేరై పోయారు.

పైన సూచించిన పరిస్థితులవల్ల ఉపాధ్యాయులు సామ్రాజ్యవాద విధానంలో నలిగిపోతున్నారు. చాలీ చాలని జీతాలతో బాధలు పడుతూ, వానిని తొలగించుకోటానికి యితర ప్రజాఉద్యమాల సాయాన్ని సాధించ లేకపోయారు. కాని ఉపాధ్యాయులలో నేడు పొంగిపొరలివచ్చే ఈచైతన్య వెల్లువముందు సామ్రాజ్యవాదులు నిర్మించిన అడ్డుగోడలు కూలిపోతాయి. సామ్రాజ్యవాద ప్రభుత్వం ఉన్నంతకాలం తమ కష్టాలు తీరవని ఉపా

ధ్యాయులు గుర్తించారు. ప్రజాప్రభుత్వం క్రింద నిర్మించబడబోయే ప్రజా విద్యా విధానంలోనే ఉపాధ్యాయునియొక్క ప్రాధాన్యత గుర్తించబడుతుంది. అప్పుడే ఉపాధ్యాయుని ప్రతిష్ఠ యినుమడై, ప్రజాసహకారంతో సౌభాగ్యవంతమైన జీవితాన్ని గడపగలుగుతాడు.

## విద్యావిధానంలోని ప్రధానలోపాలు

ప్రస్తుత వలసవాద విద్యావిధానాన్ని సమూలంగా నాశనం గావించి, దానిస్థానంలో ప్రజా విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టితేనేగాని పరిస్థితులు మారవు. జాతియొక్క సర్వతోముఖ వికాసాన్ని లక్ష్యంగా పెట్టుకొన్న జాతీయ విద్యావిధానం కావాలని [illegible] ఆందోళన జరుగుతోంది.

ఉపాధ్యాయులు తమ హక్కులను సాధించుకోటానికి ప్రజల సహకారం సంపాదించాలి. ప్రజా విద్యావిధానం కొరకు వారు యెంతగా పోరాడుతారో అంతయెక్కువగా ప్రజల సహకారాన్ని పొందగల్గుతారు. ప్రస్తుత విద్యావిధానంలో వున్న లోపాలను పిరుకూడ విమర్శనాదృష్టితో చూడాలి. ప్రధానమైన కొన్నిలోపాలను యీదిగువ పొందుపరుస్తాను.

### 1. పాఠ్యపుస్తకాలు

విద్యార్థుల విజ్ఞానాన్ని పెంపొందించుటకు సాధనాలుగా పాఠ్య గ్రంథాలుండాలి. అంతేగాక వారి అభిరుచిని, శక్తిసామర్థ్యాలను దృష్టిలో పెట్టుకొని పుస్తకాలు వ్రాయించాలి కాని ప్రస్తుతం స్కూళ్ళలో పెట్టే పుస్తకాలుచూస్తే ఆశయానికి అమడదూరంలో వుంటాయి. వలసవిద్యా విధానానికి అనుగుణ్యంగానే ఈపుస్తకాలుంటాయి. చరిత్ర పుస్తకాలు సామ్రాజ్యవాద నిర్మాతలను గూర్చి పొగడటం తప్ప మరేమిలేదు. జాతీయత మచ్చుకైనా కానరాదు. ఉదాహరణకు చెప్పాలంటే ఈరోజుకు కూడ 1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటాన్ని సిపాయిల పితూరీగానే వర్ణిస్తారు. జాతీయ పోరాటాల విషయంగాని, జాతీయనాయకుల ప్రసక్తిగాని కానరాదు. చరిత్రనంతా తప్పుల తడకగా తయారుచేసి తమ కనుకూలంగా వ్రాయిస్తారు. ఇటువంటి పుస్తకాలు విద్యార్థుల అభిమానాన్ని యెలా పొందగల్గుతాయి ? వారి అభిరుచిని యెలా పొందగల్గుతాయి ? దేశంలో బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తీవ్రపోరాటం సాగు

తున్న ఈరోజుల్లో స్కూలులో "దేవుడు సార్వభౌముని సంరక్షించాలి" అనేపాఠాలు చెప్పుతూంటే విద్యార్థులు యెలా వినగల్గుతారు? పాఠ్యపుస్తకాలు సామాజిక జీవితానికి దూరంగా వుంటూంటే విద్యార్థులకు చదువుమీద ఆసక్తినశించి తలనొప్పి వస్తే ఆశ్చర్యమేముంది?

సామ్రాజ్యవాద ఆశయాలకు వ్యతిరేకంగా జాతీయాభిమానాన్ని ప్రబోధించేటట్లు యెవరైనా పుస్తకాలు వ్రాస్తే ప్రభుత్వం అంగీకరించదు.

ఇప్పుడు వ్రాయబడే పుస్తకాలైనా ఆధునిక బోధనాపద్ధతుల ననుసరించి వ్రాయబడుచున్నావా అంటే, అదీలేదు. 25 సంవత్సరాలనాడు ఇంగ్లండులో వచ్చిన "న్యూ మెథడ్ రీడర్సు" లాంటివి మన దేశంలో ప్రచారంలోలేవు. లీలావాచకాలు ఆ పద్ధతుల్లో కొంతవరకు వ్రాయబడ్డా, యెన్ని పాఠశాలలలో వాటిని ప్రోత్సహిస్తున్నారు? గ్రంథకర్తలు అనేక మంది బయలుదేరుచున్నందుకు సంతోషమే. కాని విచారమేమంటే, బోధనా పద్ధతుల్లో వీరికేమీ పరిచయముండదు. శాస్త్రోక్తమైన పద్ధతుల్లో విషయాలు మనస్సుల్లో హత్తుకుపోయేరీతిని, విద్యార్థులకు వుల్లాసం కలిగించేటట్లు పాఠ్య పుస్తకాలుండాలి.

పాఠ్య పుస్తకాలలో వ్యాపార దృక్పథం యెక్కువైపోయినది. పుస్తకాల కంపెనీలు చౌకగా పుస్తకాలు వ్రాయించి లాభాలు సంపాదించుటకు అలవాటుపడ్డాయి. మన రాష్ట్రంలో ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ. వెంకట్రామ అండ్ కో లాంటి కంపెనీలు పుస్తకాలు అచ్చువేయించి టీచర్ మేనేజర్లమీద లోకల్ బోర్డులమీద తమ పలుకుబడి వినియోగిస్తాయి. తమ పుస్తకాలను స్కూళ్ళలో పెట్టించి లాభాలు గుంజుతున్నారేగాని వీరి ద్వారా విద్యార్థులకు జరిగే లాభం శూన్యం. పైగా వీరు తమ లాభాల కొరకు ప్రాథమికోపాధ్యాయులలో చీలికలు తెచ్చారు. ఒకరు ఆంధ్రరాష్ట్ర టీచరు మేనేజర్ల అసోషియేషన్ను ఆర్గనైజుచేసి దీనిద్వారా తమ వ్యాపారాన్ని సాగిస్తున్నారు. ఈ పుస్తకాలు తెరచి పాఠాలు చెప్పబోతే ఉపాధ్యాయులకు ఉత్సాహం వుండుటలేదు. నేర్చుకోవాలనే ఆసక్తి విద్యార్థులకు అంతకంటేవుండదు.

పోనీ ఈ చెత్త పుస్తకాలైనా సకాలంలో అందుతాయా అంటే అదీలేదు. ఈ సంవత్సరం బి. ఏ; బి. యస్. సి. క్లాసులకు నిర్ణయించిన పుస్తకాలు యింగ్లీషు కంపెనీలకు చెందినవి. రవాణా సౌకర్యాలులేక

పుస్తకాలు వచ్చుటలో ఆలస్యమగుటయేగాక, అందరికినీ దొరకనేలేదు. 100 కి 60 మందికి 2 నెలలు ఆలస్యంగా పుస్తకాలు అందజేయబడ్డాయి. ఇంతేకాదు. సంవత్సరం చివరకివచ్చినా అనంతపురం హైస్కూలులో 5 వ ఫారం విద్యార్థులకు యీ రోజువరకూడ ఇంగ్లీషు పుస్తకాలు వచ్చలేదు. ఇట్టి పరిస్థితులలే ఈనాడు సర్వసాధారణంగా అనేక స్కూళ్ళలో వున్నవి.

పరిస్థితులిలాగా వుంటే విద్యార్థులకు పరీక్షల్లో మార్కులు యెలా వస్తాయి ?

మొత్తంమీద చెప్పాలంటే విద్యాశాఖాధికారులు, విద్యాలయాధికారులు కంపెనీల లాభాలకొరకు విద్యార్థుల జీవితాలను బలిచేస్తున్నారు.

2. అవసర పరికరాలు

స్కూళ్ళలో బోధనకు అవసరమగు పరికరాలు అనేకం కావాలి. ఉదాహరణకు సైన్సుపాఠాలు చెప్పుటకు లేబరేటరీలు కావాలి. వీనిలో అనేక రసాయన పదార్థాలు అవసరముంటాయి. సైన్సు పాఠాలు ప్రాక్టికల్ ద్వారానే చెప్పాలి. కాని అవిధంగా చెప్పుటకు స్కూళ్ళలో పరికరాలు వసతులు లేక బోర్డులమీద బొమ్మలు వేసి చెప్పుటకు ప్రయత్నిస్తారు. విద్యార్థుల మెదడులలోకి యివి దూరడం కష్టం. ఉదాహరణకు పునాదిపాడు హైస్కూలులో లేబరేటరీకి 1938—39 సంవత్సరాలలో రు 980—5—0 లు ఖర్చుపెట్టబడినది. తరువాత 7 సంవత్సరాలకు కలిపి రు 361—0—0 లు ఖర్చుపెట్టబడినది. అంటే సగటున సంవత్సరానికి రు 51—0—0 లు ఖర్చుపెట్టాలన్నమాట. ఇతర స్కూళ్ళన్నీ యీ విధంగానే ఉన్నాయి.

ఇక చరిత్ర, భూగోళం చెప్పుటకు కావలసిన పటాలుకూడ కరువే ఉన్నవిగూడ యే పావుశతాబ్దానికి పూర్వంనాటివో అయి వుంటాయి. ప్రపంచంలో రాజకీయాలన్నీ ఎంతో మార్పుచెందినా ఈ రోజులలో పాఠాలు చెప్పాలంటే పాతమ్యాపులతో ఎలా సాధ్యమౌతుంది? ఇక ఎలిమెంటరీ స్కూళ్ళ విషయంలో వేరే చెప్పనవసరంలేదు. వాటిలో బోధనా పద్ధతుల కవసరమైన బొమ్మలు, బోర్డులు అసలే వుండవు.

తున్న ఈరోజుల్లో స్కూలులో "దేవుడు సార్వభౌముని సంరక్షించాలి" అనేపాఠాలు చెప్తుతూంటే విద్యార్థులు యెలా వినగల్గుతారు? పాఠ్యపుస్తకాలు సామాజిక జీవితానికి దూరంగా వుంటూంటే విద్యార్థులకు చదువుమీద ఆసక్తినశించి తలనొప్పి వస్తే ఆశ్చర్యమేముంది?

సామ్రాజ్యవాద ఆశయాలకు వ్యతిరేకంగా జాతీయాభిమానాన్ని ప్రబోధించేటట్లు యెవరైనా పుస్తకాలు వ్రాస్తే ప్రభుత్వం అంగీకరించదు.

ఇప్పుడు వ్రాయబడే పుస్తకాలైనా ఆధునిక బోధనాపద్ధతుల ననుసరించి వ్రాయబడుచున్నావా అంటే, అదీలేదు. 25 సంవత్సరాలనాడు ఇంగ్లండులో వచ్చిన "న్యూ మెథడ్ రీడర్స్" లాంటివి మన దేశంలో ప్రచారంలోలేవు. లీలావాచకాలు ఆ పద్ధతుల్లో కొంతవరకు వ్రాయబడ్డా, యెన్ని పాఠశాలలలో వాటిని ప్రోత్సహిస్తున్నారు? గ్రంధకర్తలు అనేక మంది బయలుదేరుచున్నందుకు సంతోషమే. కాని విచారమేమంటే, బోధనా పద్ధతుల్లో వీరికేమీ పరిచయముండదు. శాస్త్రోక్తమైన పద్ధతుల్లో విషయాలు మనస్సుల్లో హత్తుకుపోయేరీతిని, విద్యార్థులకు వుల్లాసం కలిగించేటట్లు పాఠ్య పుస్తకాలుండాలి.

పాఠ్య పుస్తకాలలో వ్యాపార దృక్పధం యెక్కువైపోయినది. పుస్తకాల కంపెనీలు చౌకగా పుస్తకాలు వ్రాయించి లాభాలు సంపాదించుటకు అలవాటుపడ్డాయి. మన రాష్ట్రంలో ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ. వెంకట్రామ అండ్ కో లాంటి కంపెనీలు పుస్తకాలు అచ్చువేయించి టీచర్ మేనేజర్ల మీద లోకల్ బోర్డులమీద తమ పలుకుబడి వినియోగిస్తాయి. తమ పుస్తకాలను స్కూళ్ళలో పెట్టించి లాభాలు గుంజుతున్నారేగాని వీరి ద్వారా విద్యార్థులకు జరిగే లాభం శూన్యం. పైగా వీరు తమ లాభాల కొరకు ప్రాధమికోపాధ్యాయులలో చీలికలు తెచ్చారు. ఒకరు ఆంధ్రరాష్ట్ర టీచరు మేనేజర్ల అసోషియేషన్‌ను అర్గనైజుచేసి వీనిద్వారా తమ వ్యాపారాన్ని సాగిస్తున్నారు. ఈ పుస్తకాలు తెరచి పాఠాలు చెప్పబోతే ఉపాధ్యాయులకు ఉత్సాహం వుండుటలేదు. నేర్చుకోవాలనే ఆసక్తి విద్యార్థులకు అంతకంటేవుండదు.

పోనీ ఈచెత్త పుస్తకాలైనా సకాలంలో అందుతాయా అంటే అదీలేదు. ఈ సంవత్సరం బి. ఏ; బి. యస్. సి. క్లాసులకు నిర్ణయించిన పుస్తకాలు యింగ్లీషు కంపెనీలకు చెందినవి. రవాణా సౌకర్యాలులేక

పుస్తకాలు వచ్చుటలో ఆలస్యమగుటయేగాక, అందరికినీ దొరకనేలేదు. 100 కి 60 మందికి 2 నెలలు ఆలస్యంగా పుస్తకాలు అందజేయబడ్డాయి. అంతేకాదు. సంవత్సరం చివరకివచ్చినా అమలాపురం హైస్కూలులో 5 వ ఫారం విద్యార్థులకు యీ రోజుకుకూడ ఇంగ్లీషు పుస్తకాలు సప్లయి లేదు. ఇట్టి పరిస్థితులే ఈనాడు సర్వసామాన్యంగా అనేక స్కూళ్ళలో వున్నవి.

పరిస్థితులీవిధంగా వుంటే విద్యార్థులకు పరీక్షల్లో మార్కులు యెలా వస్తాయి ?

మొత్తంమీద చెప్పాలంటే విద్యాశాఖాధికారులు, విద్యాలయాధికారులు కంపెనీల లాభాలకొరకు విద్యార్థుల జీవితాలను బలిచేస్తున్నారు.

## 2. అవసర పరికరాలు

స్కూళ్ళలో బోధనకు అవసరమగు పరికరాలు అనేకం కావాలి. ఉదాహరణకు సైన్సుపాఠాలు చెప్పుటకు లేబరేటరీలు కావాలి. వీనిలో అనేక రసాయన పదార్థాలు అవసరముంటాయి. సైన్సు పాఠాలు ప్రాక్టికల్ ద్వారానే చెప్పాలి. కాని అవిధంగా చెప్పుటకు స్కూళ్ళలో పరికరాలు వసతులు లేక బోర్డులమీద బొమ్మలు వేసి చెప్పుటకు ప్రయత్నిస్తారు. విద్యార్థుల మెదడులలోకి యివి దూరడం కష్టం. ఉదాహరణకు పునాదిపాడు హైస్కూలులో లేబరేటరీకి 1938—39 సంవత్సరాలలో రు 930—5—0 లు ఖర్చుపెట్టబడినది. తరువాత 7 సంవత్సరాలకు కలిపి రు 361—0—0 లు ఖర్చుపెట్టబడినది. అంటే సగటున సంవత్సరానికి రు 51—0—0 లు ఖర్చుపెట్టారన్నమాట. ఇతర స్కూళ్ళుకూడ యీ విధంగానే ఉన్నాయి.

ఇక చరిత్ర, భూగోళం చెప్పుటకు కావలసిన మ్యాపులుకూడ కరువే. ఉన్నవిగూడ యే పావుశతాబ్దానికి పూర్వంనాటివో అయి వుంటాయి. ప్రపంచంలో రాజకీయాలన్నీ ఎంతో మార్పుచెందినా ఈ రోజులలో పాఠాలు చెప్పాలంటే పాతమ్యాపులతో ఎలా సాధ్యమౌతుంది? ఇక ఎలిమెంటరీ స్కూళ్ళ విషయంలో వేరే చెప్పనవసరంలేదు. వాటిలో బోధనా పద్ధతుల కవసరమైన బొమ్మలు, చార్టులు అసలే వుండవు.

ఇదేవిధంగా ఇంకా అనేక ఇబ్బందులున్నాయి. విద్యార్థులు క్లాసులో కూర్చుండటానికి బల్లలుండవు. ఆడుకొనుటకు ఆటస్థలాలులేవు. వసతి గృహాలవిషయం చెప్పవలసిన పనేలేదు. యుద్ధంవచ్చాక విద్యార్థులసంఖ్య పెరిగింది. పట్టణాలలో జనసంఖ్యకూడ కొంతపెరిగింది. విద్యార్థులు నివశించడానికి తగినవసతులులేక అనేక యిబ్బందుల పాలు గావలసి వస్తోంది.

3. విద్యార్థుల ప్రాణాలుతీసే పరీక్షావిధానం

ప్రస్తుత పరీక్షా విధానం చాలా లోపభూయిష్టమైనదని, అది విద్యార్థుల శక్తిసామర్థ్యాలనుగాని, తెలివితేటలనుగాని పరీక్షించుటకు తోడ్పడుటలేదని ప్రఖ్యాత విద్యావేత్తలుసైతం అంగీకరించారు. నేడు మనపాఠశాలలలో అనేకమంది తెలివితేటలుగల విద్యార్థులు శ్రద్ధగా చదివినా మార్కులు తక్కువగా రావడమో లేక పరీక్ష తప్పడమో అందరూ కళ్ళారా చూస్తున్నదే. నూటికి 35 మార్కులువస్తే పరీక్ష ప్యాసయినట్లు, నూటికి 34మార్కులువస్తే తప్పినట్లుగా పరిగణిస్తారు. ఇంకొకమార్కు లేడానుబట్టి విద్యార్థుల తెలివితేటలను నిర్ణయించడం చాలా అర్థరహితమైనదని ఆచరణలో రుజువవుతోంది. అనేకమంది తెలివితేటలుగల విద్యార్థులు పరీక్షలు తప్పిపోవడమే యీపరీక్షావిధానంలోగల లోపాన్ని రుజువుచేస్తుంది. పరీక్షాధికారులు యిక మార్కులు వేయడంలో ఒకే పద్ధతిని అనుసరించరు. ఒకే సమాధానపత్రానికి ఒకరు ఎక్కువమార్కులు, ఇంకొకరు తక్కువమార్కులు వేసిన వుదాహరణలు అనేకం వున్నాయి. ఇట్టిలోపాలే మరెన్నోకలవు. ఇతరదేశాలలో పరీక్షా విధానంమీద అనేక పరిశోధనలు జరిపి మార్పులు గావిస్తున్నారు. కాని మనదేశంలో పాతబడి బూజుపట్టిన విద్యావిధానాలనే సామ్రాజ్యవాద ప్రభుత్వం పట్టుకుని వ్రేళ్ళాడుతోంది. ఎందువల్ల ?

సామ్రాజ్యవాదులు తమ అవుసరాలను తీర్చుకొంటానికే విద్యావిధానాన్ని పోషిస్తారు. తమ ప్రభుత్వానికి అవసరమైనంతమందినే ఉన్నతవిద్య పొందేటట్లుచూస్తారు. అంతకుమించివుంటే పరీక్షలు ప్యాసుకాకుండా వారికి అనేక అవాంతరాలు కల్పిస్తారు. ఎక్కువమంది పరీక్షలు ప్యాసైవుంటే వారందరికీ వుద్యోగాలు చూపించాలి. లేకపోతేనిరుద్యోగులంతా ప్రభుత్వానికి వ్యతిరేకంగా తయారవుతారేమోనని భయం.

సామ్రాజ్యవాద ప్రభుత్వం ఉన్నతవిద్యను నిరుత్సాహపరచడానికి పరీక్షలను ఒక ఆయుధంగా ఉపయోగించుతూంది. పరీక్ష ప్యాసయితేనే ఏ శాఖలోనైనా ప్రవేశం. అయినా ప్రభుత్వం పెట్టిన అవాంతరాలను కొంతవరకు లెక్కచేయకుండా మధ్యతరగతికి చెందినవారు తమ బిడ్డలను ఉన్నతవిద్యకు పంపించసాగారు. పరీక్షప్యాసైతే యేదో కాస్త ఉద్యోగం వస్తే కుటుంబాన్ని పోషిస్తారనే ఉద్దేశంతో యెన్నో ఆర్థిక యిబ్బందులకు గురియై ఉన్నతవిద్యకు పంపిస్తున్నారు. దేశంలో పరిశ్రమలు పెంపొందుతూంటే చదువుకొన్న యువకులందరికీ ఉద్యోగాలు కల్పించవచ్చు. కాని సామ్రాజ్యవాద ప్రభుత్వం దేశ పారిశ్రామికాభివృద్ధికి వ్యతిరేకం. పారిశ్రామిక విధానానికి వ్యతిరేకమైన ప్రభుత్వం అందరికీ ఎలా ఉద్యోగాలు కల్పించగల్గుతుంది?

అందుచే ఉన్నతవిద్యను నిరుత్సాహపరచుటకు పరీక్షల నొక సాధనంగా ఉపయోగిస్తూవచ్చింది. ఎక్కువమందిని పరీక్షల్లో తప్పించుటకు వీలైన కుటిల ఉపాయాలన్నీ అవలంబించబడ్డాయి. స్కూలుఫైనలు, యూనివర్సిటీ పరీక్షల్లో నూటికి కొంతమందికన్న ఎక్కువ ప్యాసుకానీయ గూడదని నిర్ణయించుకొని ఆవిధముగా పరీక్షలు నడుపుతారు. పరీక్షా పత్రంలో ఎక్కువగా విద్యార్థులకు తెలియకుండా మారుమూలనుండే విషయాలపై గుంటచిక్కులతో గూడిన ప్రశ్నలువేసి వేధిస్తూవుంటారు. ఈ పద్ధతివల్ల ఎంతోమంది శ్రద్ధగా చదివినవారుసైతం పరీక్షల్లో తప్పడం సహజంగా జరుగుతూంటుంది.

విద్యార్థుల్ని పరీక్షించాలంటే వారికి తెలిసిన విషయములలో ప్రశ్నలువేయాలి. అప్పుడే వారి శక్తిసామర్థ్యాలను తెలుసుకోవచ్చును. ప్రధానమైన యీ లోపం ఇతర దేశాలలో చాలవరకు తొలగించబడుతోంది. అంతేగాకుండా పరీక్షకు కూర్చునేవారి సంఖ్యనుకూడ సాధ్యమైనంతవరకు తగ్గించుటకు మధ్యలో డిటెన్షన్ పరీక్ష అనిపెట్టి పడబోస్తారు

ఈ డిటెన్షన్ పద్ధతి విద్యావిధానానికే కళంకమైనదని విద్యావేత్తలంతా ఘోషిస్తున్నా దీని నింతవరకూ తొలగించలేదు. గత పది సంవత్సరాలుగా విద్యార్థులు ఒంటరిగా యీ డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా పోరాడుచున్నారు. బందరు, గుంటూరు విద్యార్థుల పోరాటాలు సాగించారనే కారణంతో కాలేజీ అధికారులు యూనివర్సిటీ మద్దతుతో

ఎంతోమందిని బలిగొన్నారు. బందరు హిందూకళాశాలలో రెండవ తరగతి (ఇంటర్) విద్యార్థులను పరీక్షలు 10 రోజులుండగా, ప్రిన్సిపాల్ సుమారు 200 మందిని డిటైన్ చేశాడు. వీరిలో కొందరు మొదటి తరగతిలో కృతార్థులయ్యేవారుకూడ ఉన్నారని విన్నప్పుడు యిది ఎంత దారుణచర్యయో అర్థమవుతుంది. బానిస విద్యావిధానం ఎందరి విద్యార్థుల ఉజ్వల భవిష్యత్తును మంటగలుపుతోందో ప్రతి ఉపాధ్యాయుడూ ఆలోచించాలి. పరీక్షలలో విద్యార్థుల స్థాయి తగ్గిపోతోందని అందుకు డిటెన్షన్ పరీక్ష అవసరమని ప్రభుత్వం కుంటిసాకులు చూపుతోంది. విద్యార్థుల స్థాయి పడిపోవుచున్నమాట వాస్తవమే కావచ్చు. దానికి విద్యార్థులు చదువకపోవుట యదార్థకారణం కానేకాదు. నేడు యేపరిస్థితుల్లో విద్యాలయాలున్నాయో ఆలోచిస్తే యదార్థం బోధపడుతుంది.

ఉపాధ్యాయులు తమకు వేతనాలు సరిగాలేవనే అసంతృప్తితో తమ శక్తులన్నింటినీ విద్యార్థులమీద కేంద్రీకరించలేకపోతున్నారు.

పాఠ్యపుస్తకాలు విద్యార్థుల అభిరుచికి తగినట్లుగా ఉండవు. అవికూడా సకాలంలో దొరకుటలేదు. ఈ సంవత్సరం అర్ధసంవత్సర పరీక్షలవరకుకూడా పుస్తకాలందని ప్రదేశాలున్నాయి.

పాఠాలు బోధించుటకు తగిన పరికరాలు స్కూళ్ళలో సప్లయిలేదు. ఇంకా యిట్టివే అనేక యిబ్బందులున్నాయి.

ఈ లోపాలన్నీ ప్రభుత్వం అవలంబించే వైఖరివల్లనే వస్తున్నాయి. ప్రభుత్వం చేసిన అపరాధాలకు పరిహారంగా డిటెన్షన్ విధానంద్వారా విద్యార్థులను చెల్లించమంటున్నారు. ఇది యెంత ఘోరమో ప్రతివారూ ఆలోచించాలి. నేటి పరీక్షావిధానం అనేక చెడుఫలితాలకు దారితీస్తోంది. పాఠాలు బోధించకుండా ఉపాధ్యాయులు కోర్సులు పూర్తిచేస్తుంటే, వ్రాయకుండా పరీక్షలు ప్యాసగుటకు కొందరు విద్యార్థులు ప్రయత్నాలు సాగిస్తున్నారు. పరీక్షా పత్రాలు వెల్లడిఅగుట, పరీక్షలలో కాపీలుచేయుట, డబ్బుతో మార్కులు వేయించుకోవడం మొదలగు ఈ చెడు ఫలితాలన్నీ యెలా వచ్చాయి? ఇవి విద్యార్థుల తప్పులవల్ల సంభవించినవికావు. అసలు విధానంలోఉన్న లోపాలవల్లనే ఈ గందరగోళం అంతా జరుగుతోందని ఉపాధ్యాయులు గ్రహించాలి.

ప్రస్తుత పరీక్షావిధానం మరొక ప్రమాదానికికూడా దారితీస్తోంది.

దేశంలో ఉన్నతవిద్య నభ్యసించేవారి సంఖ్యతోబాటు అవకాశాలు పెరుగుటలేదు. దేశం పారిశ్రామికంగా అభివృద్ధికాలేదు. టెక్నికల్ కళాశాలలు, మెడికల్ కళాశాలలు, సైన్సు కళాశాలలు పెరుగుటలేదు. దీనివల్ల ఉన్న సంకుచిత అవకాశాలకు విద్యార్థులలో పోటీ విపరీతంగా పెరిగింది. పై కాలేజీలలో ప్రవేశానికి విద్యాప్రమాణాన్ని యెన్నోరెట్లు ప్రభుత్వము హెచ్చించింది. దీనిఫలితంగా విద్యార్థులు తమ సర్వశక్తులనూ, కాలాన్నీ పరీక్షలపై కేంద్రీకరించి ఇతర విషయాల జోలికి పోవుటలేదు. అందువలననే ఆటలు, డిబేట్సు మొదలగు (Extra curricular activities) వానివైపు యెవ్వరూ వెళ్ళుటలేదు. పరీక్షలలో మార్కులు యెలా సంపాదించాలనే తాపత్రయమే హెచ్చుగా కాన్పిస్తోంది. ఆటలు, డిబేట్సు మొదలగు వానిలో విద్యార్థులు పాల్గొననందున వారి మానసిక, శారీరక శక్తులు సంపూర్ణవికాసం చెందుటలేదు. విద్యాలయాల్లో ఆటగాండ్రు, వ్యక్తులు, రచయితలు ఆసంవత్సరాని కాసంవత్సరం తగ్గిపోవుటయేగాక పైవానిలో ప్రమాణాలుకూడ తగ్గిపోతున్నాయి. ఇలా పరిస్థితులు కొంత కాలం నడిస్తే జాతి శారీరక, మానసిక శక్తులే క్షీణించిపోయి 'పుస్తకాల పురుగుల' జాతిగా తయారయ్యే ప్రమాదమున్నది. అందుచే పరీక్షా విధానాన్ని ఈ దిగువ సూచనల ననుసరించి పూర్తిగా సంస్కరించాలి.

— ఆధునికపద్ధతుల్లో విద్యార్థుల తెలివితేటలను విజ్ఞానాన్నీ, పరీక్షించుటకుపయోగపడే విధంగా (On the basis of intelligence tests) పరీక్షా పత్రాలు తయారుచేయాలి.

— సమర్థత ఉన్నవారు అందరూ పరీక్ష ప్యాసు అగుటకు అవకాశాలు కల్పించి యెక్కువమంది పరీక్షలలో కృతార్థులయ్యేటట్లుచూడాలి.

— ఒక భాగంలో తప్పితే ఆ భాగాన్నిమాత్రమే పూర్తిచేస్తే సరిపోవాలి. ఒకభాగం తప్పితే అన్ని భాగాలలో తప్పినట్లు యెంచబడుతోంది. (స్కూలుఫైనల్, ఇంటర్‌మీడియట్ గ్రూప్) తప్పిన భాగాలు పూర్తిజేసుకొని పైక్లాసు చదువుటకు అవకాశాలు కల్పించాలి.

— స్కూలుఫైనల్ పరీక్షలో తప్పిన విద్యార్థులకు సెప్టెంబరులో మరల పరీక్షపెట్టాలి. మూడుసార్లు స్కూలుఫైనల్ తప్పితే ఇక చదువ వీల్లేదనే నిబంధన తొలగించాలి. ఎన్నిసార్లయినా పరీక్షకు కూర్చొని ప్యాసగుటకు అవకాశంయివ్వాలి.

— రోజుకి ఒక పరీక్షమాత్రమే జరపాలి. రోజుకు రెండు పరీక్షలు పెట్టి (5 లేక 6 గంటలు) నందువల్ల శారీరక, మానసిక అలసటతో సరిగా సమాధానాలు వ్రాయలేకపోతున్నారు.

4. విద్యాలయాలలో క్రమశిక్షణ పోతోందా ?

ఈనాడు స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ క్రమశిక్షణపోతోందని విద్యాలయాధికారులు, ఉపాధ్యాయులు అభిప్రాయపడుచున్నారు. ఇది నిజమే. కాని దీనికి విద్యార్థి సంఘాలు, ఇతర రాజకీయపార్టీలు కారణమంటూ విద్యాలయాధికారులు, ఉపాధ్యాయులు తప్పిదాలను యితరులమీదకు నెట్టి వేస్తున్నారు. ఎందువల్ల విద్యాలయాలలో శిక్షణలేకుండా పోతుందో, ఏ పరిస్థితులు విద్యార్థులను క్రమశిక్షణా వ్యతిరేకులుగా చేసిందో ఉపాధ్యాయులు విమర్శనా దృష్టితో అర్థంచేసుకోవాలి.

క్రమశిక్షణ అంటే స్వేచ్ఛాయుతంగాను, ఐచ్ఛికంగాను ఉండాలి. అదివిద్యార్థులపై నిర్బంధంగా రుద్దితే వచ్చేదిగాదు. వారి మనస్సునుండి జనింప జేయాలి. సామాన్యంగా యిది ప్రతి విద్యావేత్తా అంగీకరించే సత్యమే. కాని అట్టి శిక్షణకు అనుకూలమైన పరిస్థితులు విద్యాలయాధికారులు కల్పించాలి. అనుకూలమైన పరిస్థితులు లేనప్పుడు స్వేచ్ఛాయుతమైన, ఐచ్ఛికమైన శిక్షణ ఉండజాలదు. నేడు అట్టిపరిస్థితులున్నవోలేవో ఒక్కసారి ఆలోచిస్తే ప్రతివారికీ స్పష్టపడుతుంది.

ప్రస్తుత బానిస విద్యావిధానంలో ఉన్నలోపాలు కొంతవరకు పైన సూచించబడ్డాయి. ఈలోపాలవల్లనే విద్యాలయాల్లో యివ్వబడు విద్య, విద్యార్థుల ఆదరాభిమానాలను పొందలేకపోతోంది.

దేశంలో కార్మికులు, కర్షకులు బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుచున్నప్పుడు, వారిబిడ్డలైన విద్యార్థులు తమ భవిష్యత్తును ధ్వంసంచేసే బానిస విద్యావిధానానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తున్నారంటే ఆశ్చర్యమేముంది? ప్రజలు జాతీయ ప్రభుత్వం కొరకు పోరాడుచున్నట్లే విద్యార్థులు జాతీయవిద్యావిధానం కొరకు పోరాడుటలో ఆశ్చర్యమేముంది ?

విద్యాలయాల్లో ఉన్న యితర లోపాలు పైన సూచించబడ్డాయి. పాఠ్యపుస్తకాలుగాని, చెప్పేపాఠాలుగాని విద్యార్థుల అభిరుచికి జాతీయా

శయాలకూ విరుద్ధంగా ఉన్నప్పుడు విద్యార్థులలో శిక్షణ యెలా ఉండ గల్గుతుంది? బైటి ప్రపంచంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలు హోరాహోరిగా పోరాడుతూంటే, విద్యాలయాలలో సామ్రాజ్యనిర్మాత లనుగూర్చి పొగడుతూ పాఠాలు చెప్పితే విద్యార్థులు సహానాన్నిగాని, శిక్షణనుగాని ఎలాచూపగల్గుతారు?

అంతేకాదు. చెప్పేవిషయాలైనా సులువైన బోధనాపద్ధతులద్వారా చెప్పుచున్నారా అంటే అదీ శూన్యమే. ఉపాధ్యాయులు తమ వేతనాలు సరిగా లేవనే అసంతృప్తితో యితర ఉపవృత్తులు చూచుకొనుటగాని, లేక ప్రయివేట్లు చెప్పుకొనుటగాని జరుగుచున్నందువల్ల పాఠాలను చెప్పు టకు సరిగా తయారై వచ్చుటలేదు. విద్యార్థులకు అర్థమయ్యే రీతిని చెప్పనందువల్ల వారు ప్రశ్నలువేస్తే విసుగుకొనుట, జరిమానాలువేయుట. ఈ నిర్బంధాలకు వ్యతిరేకంగా ఆందోళన చేస్తే విద్యాలయాలనుండి బహిష్కరించుట జరుగుతోంది. బోధనాపద్ధతులు సరిగాలేనందువల్ల విద్యార్థులకు పాఠాలంటే విముఖత యేర్పడి శ్రద్ధగా వినలేకపోవడం సంభవిస్తోంది. దీనికి బాధ్యులు విద్యార్థులా? విద్యాలయాధికారులా?

విద్యాలయాలలో విద్యార్థులపై ప్రత్యేకశ్రద్ధచూపెట్టడానికి కూడ అవకాశాలు లేకుండాచేశారు. ఇటీవల విద్యార్థుల సంఖ్య పెరిగింది. ప్రభుత్వం ఉపాధ్యాయుల సంఖ్య పెంచకుండా ప్రతిసెక్షన్‌లోనూ విద్యా ర్థుల సంఖ్య పెంచారు. లోగడ 40 మంది ఉంటే ఇప్పుడు 45 మంది వరకు పెంచారు. సామాన్యంగా ఒకసెక్షన్‌లో 25 మందికంటే ఎక్కువ మంది విద్యార్థులుంటే ప్రతి విద్యార్థిపైనా ప్రత్యేకశ్రద్ధ చూపెట్టుట అసాధ్యం. ప్రభుత్వం ఉపాధ్యాయుల సంఖ్యను పెంచి యెక్కువ డబ్బు వినియోగించుటకు యిష్టంలేక విద్యార్థుల అభివృద్ధిని అరికట్టుతోంది.

విద్యావిధానంలో ఉన్న పైలోపాలన్నింటికీ వ్యతిరేకంగా విద్యా ర్థులు ఆందోళన చేస్తున్నారు. నిరంతర పోరాటం సాగిస్తున్నారు. దీనికి ఉపాధ్యాయులుకూడ సానుభూతి చూపెట్టి సహకరించాలి. కాని ఇంత వరకూ ఉపాధ్యాయులు విద్యార్థిపోరాటాలను వ్యతిరేకిస్తూ ప్రభుత్వానికి తోడ్పడుతూవచ్చారు. శిక్షణసాకుతో ప్రభుత్వం విద్యార్థులపై సాగించే దారుణచర్యలకు సాయపడుతూవచ్చారు.

బానిస విద్యావిధానంక్రింద ఆదర్శమైన శిక్షణ ఉండజాలదు. దేశభక్తియుత విద్యావిధానంక్రిందనే స్వేచ్ఛాయుతమైన, ఐచ్ఛికమైన శిక్షణ లాభించగల్గుతుంది. ఉపాధ్యాయసోదరులు ఈ యదార్థపరిస్థితుల్ని గుర్తించాలి.

5. మాతృభాషయెడల సవతితల్లి ప్రేమ

ప్రభుత్వము మాతృభాష పద్ధతిని అరికట్టుతూవచ్చింది. సిలబస్‌లో మాతృభాషకు తక్కువస్థానం ఇస్తూవచ్చారు. ప్రధాన భాషయైన మాతృభాషను రెండవ భాషగాను, ఆంగ్లభాషను ప్రథమభాషగానూ పరిగణిస్తూ వచ్చారు. మాతృభాషయెడ అవలంబించేవైఖరినే, మాతృభాషా పండితుల యెడ ప్రభుత్వము అవలంబించింది. ఇతర ఉపాధ్యాయుల జీతాలకంటె పండితుల జీతాలు తక్కువ.

మాతృభాష ద్వారానే విద్యగరపాలని ఎంతో కాలంనుండీ ఆందోళన చేస్తున్నా యింతవరకూ కాలేజీలలో మార్పు తీసుకొనిరాలేదు.

తక్షణ భవిష్యత్తులో మార్పు తీసుకొచ్చే అవకాశాలు వున్నట్లు కూడా కల్పించుటలేదు. మాతృభాషద్వారా విద్యగరిపితేనే విద్యార్థులకు సులభముగా గ్రాహ్యమౌతుందని అందరూ అంగీకరించినా, ప్రభుత్వము ఈరోజుకికూడా అశ్రద్ధ చేస్తున్నదంటే దానికి కారణము మాతృభాష యెడల ఉండే సవతితల్లి వైఖరితప్ప మరొకటి కానేరదు.

విద్యావిధానంలోవున్న ప్రధాన లోపాలేవో కొంతవరకు పైన వివరింపబడ్డాయి. వీనిని తొలగించుటకు యింతవరకూ ఉపాధ్యాయులు ఆందోళన సాగించలేదు దేశంలోని రాజకీయపక్షాలు, విద్యార్థిసంఘాలు తీవ్ర ఆందోళన సాగిస్తూంటే ఉపాధ్యాయులు తమకుపట్టనట్లుగా దూరంగా వుంటూవచ్చారు.

విద్యావిధాన సంస్కరణకొరకు కృషిచేయుట ఉపాధ్యాయుల యొక్క ప్రప్రథమ బాధ్యత. ఉపాధ్యాయులు తమ హక్కులకొరకు పోరాడు యీ సమయంలో తమ ప్రథమ బాధ్యతను గుర్తించాలి. ఎంత ఎక్కువగా దీనిని గుర్తిస్తారో అంత ఎక్కువగానూ, అంత త్వరగానూ ప్రజల, విద్యార్థుల సహకారాన్ని పొంది తమ హక్కులను సాధించుకోగల్గుతారు.

## బడిపంతుళ్ళ గోడు జాతి భవిష్యత్తుకే కీడు

నేడు ఉపాధ్యాయుల జీతాలు చాలాఅధ్వాన్నంగావున్నాయి.

మానవుని కనీస జీవితావసరాలను తీర్చడానికేమాత్రమూ సరిపోవ దముతేదు. ప్రభుత్వము నిర్ణయించిన కనీసజీతం రూ 15. మామూలు కూలీ(Unskilled Worker) బజారులో రోజుకు రూపాయి సంపాదించు కొంటున్న ఈ రోజుల్లో ప్రభుత్వం నిర్ణయించిన జీతాలతో వారిపొట్టనెలా నింపుకోగల్గుతారు? కుటుంబాలనెలా పోషించుకోగల్గుతారు? ఈ దుర్భర దారిద్ర్య పరిస్థితులలో జాతికెలా సేవచేయగల్గుతారు?

జీతాలుచాలక ఉపాధ్యాయులు అనేకఉపవృత్తులు చేపట్టవలసి వస్తూ ఉంది. ప్రాథమికోపాధ్యాయులు గ్రామాలలో పొలం కౌలుకుచేసుకొనో లేక ఏదయినా చిన్నవ్యాపారం చేసుకొనో జీవితం గడుపవలసి వస్తోంది. దీనివల్ల స్కూళ్ళలో చదువు పాడయి పోతూంది. తమ పిల్లలకు చదువు అబ్బుటలేదనే అసంతృప్తితో తల్లిదండ్రులు స్కూళ్ళనుండి తమ పిల్ల లను మాన్పించి వేస్తున్నారు. ప్రాథమిక పాఠశాలలలో పిల్లలసంఖ్య క్రమేపీ పడిపోతోంది. కొన్నిప్రాంతాలలో ప్రయివేటు పాఠశాలల సంఖ్య పెరుగుతున్నది. ఇది ప్రాథమికపాఠశాలలపై యేర్పడిన అవిశ్వాసానికి నిదర్శనం. విద్య ఎంతో ఎక్కువగావలసిన యీరోజుల్లో, వున్న పాఠ శాలలే ఈవిధముగా నిష్ప్రయోజనమైపోతున్నాయి.

హైస్కూళ్ళలోకూడ దాదాపు యిట్టి పరిస్థితులే ఉన్నాయి. ఉపా ధ్యాయులు స్కూలుబైట కాలాన్నంతా ప్రైవేట్లు చెప్పుకొనో, యితర వృత్తులు చూచుకొనో కుటుంబాలను పోషించవలసి వస్తూవున్నది. తమ శక్తినంతా ఆవిధముగా వినియోగించి స్కూలులోకివచ్చి సంతృప్తి కరంగా పాఠాలు చెప్పలేక పోతున్నారు. దీనివల్ల విద్యార్థులు పొంద వలసిన లాభం పొందలేక పోతున్నారు. ప్రతి విద్యార్థీ పరీక్ష ప్యాసు అగుటకు స్కూలులో ఉపాధ్యాయులు చెప్పేదానిమీద కాకుండా బైట ప్రైవేట్లమీద ఆధారపడవలసి వస్తూంది. అసలే జీతాలు, పుస్తకాలఖర్చులు భరించలేని యీరోజుల్లో ప్రజలకు యిదిఎంతో ప్రయాసకాదా?

ఉపాధ్యాయుల జీతాలు చాలాతక్కువగా యున్నందువల్ల చదువు కొన్న యువకులు ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించుటకు ముందుకువచ్చుట

లేదు. ఇతర వృత్తులు ఎక్కువ లాభసాటిగా వున్నందువల్ల వానిలో ప్రవేశిస్తున్నారు. అవసరానికి తగినంతమంది సమర్థత గలవారు ట్రైనింగు కాలేజీలకు, స్కూళ్ళకు రాలేకపోతున్నారు. ప్రభుత్వము యిచ్చే స్టయి ఫెండ్లు యేవో కళ్ళునీళ్ళు తుడవడానికిచ్చేవేగాని, ఉపాధ్యాయ వృత్తిని ప్రోత్సాహ పరచేటట్లుగా లేవు.

మదరాసు రాష్ట్రంలో ప్రస్తుతంఉన్న పాఠశాలలకే తగినంతమంది ఉపాధ్యాయులులేరు. మన రాష్ట్రానికి ప్రస్తుత అవసరాలకు 4 వేలమంది సెకండరీగ్రేడ్ ఉపాధ్యాయులు తక్కువగా యున్నారని తెలుస్తోంది. కృష్ణాజిల్లాబోర్డు హైస్కూలులో యీరోజుకి (సంవత్సరాంతంలో) ఉపాధ్యాయులులేక విద్యార్థులు బాధపడుతున్నారు. పరీక్షలు సమీపించినా నందిగామ హైస్కూల్లో ముగ్గురు ఉపాధ్యాయులు తక్కువగాయున్నారు. ఎవ్వరైనా శెలవుపెడితే అస్థానంలోకి యింకొకరు వచ్చేదిక్కులేదు. ఇట్టి పరిస్థితులే నేడు ప్రతి స్కూలులో వున్నవి. మొత్తం కృష్ణాజిల్లా బోర్డు హైస్కూళ్ళ అవసరానికి నూటికి 15 మంది ఉపాధ్యాయులు తక్కువగా యున్నారని తెలుస్తూయున్నది.

ఉపాధ్యాయులు లేకుండా విద్యార్థులు పరీక్షలు ఎలా ప్యాసు కాగలుగుతారు? ఉన్నత విద్యకిచ్చే ప్రోత్సాహమిదేనా?

మన విద్యావిధానం యీ విషవక్రంనుండి బైటపడాలంటే ఉపాధ్యాయుల స్థితిగతుల్ని యెంతో అభివృద్ధిచేయాలి. వారి ఆర్థిక స్థితిని చక్కజేసి ఉపాధ్యాయ వృత్తిని ప్రోత్సహపరిస్తేనేగాని మన విద్యావిధానము ముందుకుపోజాలదు.

## ప్రజామంత్రులు - ఉపాధ్యాయులు

ఉపాధ్యాయులు తమ వేతనాలను హెచ్చించాలని చాలాకాలం నుండీ ఆందోళన చేస్తున్నారు. వారి ఆందోళన చెవిటివారిముందు శంఖ మూదినట్లు అయింది. సామ్రాజ్యవాదులు ఉపాధ్యాయుల దుస్థితిని చక్కజేయనిరాకరించారు. ప్రజామంత్రులు అధికారంలోకివచ్చారు. ఉపాధ్యాయులు గంపెడాశతో కాంగ్రెసు మంత్రులు తమ స్థితిని బాగుచేస్తారని యెదురుచూశారు. కాంగ్రెసు ఎన్నికల వాగ్దానాలు ఆచరణలోకివస్తాయనీ, తమకు మంచిరోజులు రానున్నాయనీ కలలుగన్నారు. ఎట్టకేలకు 20

పర్యాయాలు ఆలోచించి ప్రజామంత్రులు ఉపాధ్యాయుల జీతాలస్కేళ్ళను మార్చుతూ ఒక ప్రకటనబైటపెట్టారు. దానిలో జీతాలు ఈవిధంగాఉన్నవి.

| స్కూళ్ళు | లోయర్ గ్రేడ్ | హయ్యర్ గ్రేడ్ | సెకండరీ గ్రేడ్ | ఎల్.టి. |
|---|---|---|---|---|
| ప్రభుత్వ స్కూళ్ళు | 20—35 | 25—45 | 45—90 | 80—120 |
| లోకలు బోర్డు లేక మునిసిపాలిటీస్కూళ్లు | 20—30 | 25—40 | 35—65 | 70—110 |
| ఎయిడెడ్ స్కూళ్ళు | 15 | 20—25 | 23—35 | 30 |

ఈమార్పులపై దీర్ఘ విమర్శన అవసరంలేదు. జాగ్రత్తగా ఆలోచించి ప్రభుత్వం చేసిన నిర్ణయాలు, కొందరిని కాకపోతే కొందరినైనా సంతృప్తిపరచాలి. ఎవరినీ ఈమార్పులుసంతృప్తిపరచలేదనే దానికి రాష్ట్ర వ్యాపితంగా నేడు ఉపాధ్యాయులు గావిస్తున్న ఆందోళనే ప్రత్యక్ష నిదర్శనము. తమ కోర్కెలను అంగీకరించకపోతే ప్రత్యక్ష చర్యకు పూనుకోవలసి వస్తుందని ఉపాధ్యాయులు అనేకచోట్ల తీర్మానించారు. ఈమార్పులలో ప్రధానలోపాలు ఏమిటి ?

(1) విద్యాభివృద్ధి ఆవశ్యకతను ప్రభుత్వం శ్రద్ధగా గుర్తించి నట్లగుపించుటలేదు. ఉపాధ్యాయుల జీతాలు హీనస్థితిలో ఉన్నంతకాలం విద్యావిధానం ప్రస్తుత విషచక్రంనుండి బైటపడజాలదు. కనీస మానవావసరాలనుకూడ తీర్చేటట్లులేవు ఈజీతాలు. అందులో ఎయిడెడ్ స్కూళ్ళ ఉపాధ్యాయుల జీతాలు మరింత అధ్వాన్నంగా ఉన్నవి. లోయర్ గ్రేడ్ ఉపాధ్యాయుని జీతం రు 15-0-0 లు నిర్ణయించుటలో ప్రభుత్వ ఉద్దేశం యేమిటో యెవరికీ బోధపడుటలేదు. తమ జీతాలను ( రు 500 నుండి 1500 వరకు — మూడురెట్లు పెంచుకున్న మంత్రులు ) ప్రాధమికోపాధ్యాయుడు రు 15 లు తో బ్రతికి పిల్లలకు చదువు చెప్పవలెననేనా ఉద్దేశ్యం? ఉపాధ్యాయునికి కనీస జీతం రు 50 లు ఉండాలని ఉపాధ్యాయులుచేస్తూ వచ్చిన ఆందోళనను ప్రజామంత్రులు పెడచెవిని బెట్టారు. ఆశలుకూడా పెట్టుకోవద్దని ప్రధానమంత్రిగారు సెలవిచ్చారు। ప్రభుత్వ యాజమాన్యమున తయారుచేసిన సార్జెంటు స్కీములోకూడ ఉపాధ్యాయుల జీతాలు పెంచితేగాని విద్యావిధానం అభివృద్ధి చెందజాలదనీ, కనీస జీతం రు 40 ఉండాలనీ సూచించబడింది. విద్యావ్యాప్తి విషయంలో సామ్రాజ్యవాదులు

బాధ్యతారహితంగా ప్రవర్తిస్తే ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. కాని జాతిశ్రేయస్సుకొరకు పాటుబడవలసిన ప్రజామంత్రులు ఉపాధ్యాయుల విషయంలో నిర్లక్ష్యంచేసి మన బిడ్డల భవిష్యత్తును నాశనం చేయడం శోచనీయం.

(2) జీతాల స్కేళ్ళను నిర్ణయించుటలో అర్థంలేని విచక్షణ చూపింది ప్రభుత్వం. ప్రభుత్వస్కూళ్ళలో వారికి ఎక్కువజీతాలు, అంత కంటె లోకల్‌బోర్డు స్కూళ్ళలోవారికి కొంతతక్కువ, ఎయిడెడ్ స్కూళ్ళలోవారికి అందరికంటె తక్కువ. కాని, ఇంతా అవస్థపడి ఇన్ని అంతస్తుల్ని సృష్టించినా, ఎవరికీ పొట్టనిండే జీతాలుకావు. అద్వయిజర్లు చూపుతూ వచ్చిన తేడాలే కాంగ్రెసు మంత్రులుకూడా పాటించుట మరింత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఈనాడు మనరాష్ట్రంలో ప్రాథమిక పాఠశాలల్లో మూడవవంతు ఎయిడెడ్ పాఠశాలలు. ఎయిడెడ్ స్కూళ్ళవిషయంలో ప్రభుత్వం ఇచ్చే గ్రాంటులు యేదో ముష్టి వేసినట్లుగా ఉన్నవి. వీనివిషయంలో తమ బాధ్యత ఉన్నట్లు ప్రభుత్వం భావించుటలేదు. ఈ పాఠశాలలు విద్యావ్యాప్తి కొరకు పాటుబడుటలేదా? వీనివిషయంలో కన్పరచే చిన్నచూపు ప్రజా మంత్రులు విద్యాభివృద్ధిమీద కన్పరచే చిన్నచూపుగానేఅర్థంచేసుకోవాలా?

పోనీ 'పెద్దచూపు' జూచిన ప్రభుత్వస్కూళ్ళస్థితి ఆలోచించుదాం. హయ్యర్‌గ్రేడ్ ఉపాధ్యాయునికి రు 25/- లతో ప్రారంభించి రు 45/- ల వరకు పెంచుతారు. ఈ రు 25/- ల జీతంతో తన పొట్ట నెలా పోసుకో వాలి? భార్యా బిడ్డల్ని ఎలా పోషించాలి? అభివృద్ధి అయ్యే అవకాశా లేమైనా ఉన్నాయా అంటే, ఎప్పటికో తలనెరసిన తరవాత రు 45/- ల వరకు వెళుతుంది. ఇదే ప్రభుత్వస్కూళ్ళపైజూపిన ప్రత్యేక మెహర్బానీ.

ఒకే విద్యార్హతకలిగి ఒకే పని జేస్తున్నవారిమధ్య ఈ తేడాలు ఎవరి ప్రయోజనాలకి? విద్యాభివృద్ధికా? లేక ఉపాధ్యాయులను మోసగిం చుటకా? చైతన్యంపొందిన నేటి ఉపాధ్యాయులను ఈ విచక్షణలు ఏమాత్రం దగా చేయలేవు. సామ్రాజ్యవాదుల పరిపాలనక్రింద ఈ విచ క్షణలతోను, తేడాలతోను, విసిగి వేసారి తమ సంఘశక్తిపై ఆధారపడాలి అని తెలుసుకోగలిగారు.

(3) పండితులకు అన్యాయం:— పాశ్చాత్య భాషకున్న ప్రాధా

స్యతను తగ్గించి దేశీయ భాషలను ప్రోత్సహించాలని కాంగ్రెసువాదులు చాలాకాలంనుండి చెప్పుచున్నారు. ఇటీవలనే కేంద్ర అసెంబ్లీలో అబ్దుల్ కలాం అజాద్ కూడ అదే చెప్పాడు కాని ప్రజామంత్రులు రివైజుడు స్కేళ్ళలో దీనిని మరచిపోయారు. స్కేళ్ళను రెండు గ్రేడులుగా విభజించారు. మొదటిది రు 70 – 5 – 150, రెండవది రు 45–3–60–2 – 90. మొదటి గ్రేడులో పండితులు స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసై ఉండాలని నిబంధన పెట్టినందువల్ల యిట్టివారు రాష్ట్రంలో మొత్తం 1200 మందిలో 50 మందికంటె ఎక్కువ ఉండరు. అందుచేత స్కేలు పెంచామని చెప్పుతూ, రెండోవైపున దానిని పొందుటకు వీలులేకుండా స్కూలు ఫైనలు పరీక్షప్యాసు అవ్వాలనే అభ్యంతరాన్ని కలిగించారు. యిప్పటికి దాదాపు 80 సంవత్సరాలనుండి మన పాఠశాలలలోను కళాశాలల్లోను ప్రత్యేక ఇంగ్లీషు అర్హతలు లేకుండా దేశీయభాషలను బోధించుటలేదా ?

రెండవస్కేలు విషయంచూస్తే ప్రభుత్వం చూపిన ఘనత ఏమీ లేదని తెలుస్తుంది. 1935 నుండి లోకల్ బోర్డు, మున్సిపల్ స్కూళ్ళలో రు. 45–75 గ్రేడులు ఇస్తూనే ఉన్నారు. అందుచేత ఈ నూతనస్కేళ్ళు పండితులకు చేసే మేలు ఏమీలేదు. యితర పట్టభద్రులకంటె మాతృభాషలో పట్టభద్రులైన పండితులను చిన్నచూపుచూచుటేనా మాతృభాషను ప్రోత్సహించుట ?

(4) స్కూళ్ళలో ఉండే డ్రిల్లు, డ్రాయింగు మొదలగు యితర ఉపాధ్యాయుల విషయంలోకూడ అత్యల్ప మార్పులు చేశారు. కాని యివి యేమాత్రం సంతృప్తికరంగాలేవు.

మొత్తంమీద చెప్పాలంటే - ప్రభుత్వం చేసిన మార్పులు విద్యా విధానాన్ని ముందుకు గొంపోవుటకు తోడ్పడేవిగాలేవు. ఉపాధ్యాయులు చాలాకాలంనుండి తమ కనీస జీతాలు ఈ దిగువ విధంగా ఉండాలని ఆందోళన చేస్తున్నారు.

| | | |
|---|---|---|
| లోయర్ గ్రేడ్ | రు. | 50—1½—65 |
| హయ్యర్ గ్రేడ్ | | 50—2—75 |
| సెకండరీ గ్రేడ్ | | 75—3—100 |
| యల్. టి | | 100—5—150 |

పండితులకు పట్టభద్రులతోబాటు సమాన జీతాలు ఇవ్వాలి. డ్రిల్లు, డ్రాయింగు, కార్పెంటరీ, వీవింగ్ మొదలగు ఇతర ఉపాధ్యాయులకు సెకండరీగ్రేడ్ స్కేలు యివ్వాలి.

వేతనాలను అభివృద్ధి చేయుటతోబాటు ఉపాధ్యాయులకున్న ఇతర అభ్యంతరాలను తొలగించాలి. వారి స్వేచ్ఛాస్వాతంత్ర్యముల నరికట్టే 154, 416 మొదలగు జి. ఓ. లు రద్దుచేయాలి.

విద్యాశాఖాధికారుల నిరంకుశ పెత్తనాన్ని అపుజేయించాలి. అసెంబ్లీలోను, స్థానికసంస్థలలోను పాల్గొనేహక్కును ఉపాధ్యాయుల కివ్వాలి. 1939 వరకు ఉన్న ఈహక్కును (నెం 1280 జి ఓ.) ప్రభుత్వం ఒక్క కలంపోటుతో తొలగించింది. వెంటనే తగిన మార్పుచేయాలి.

ప్రభుత్వం ఉపాధ్యాయుల కనీసహక్కుల ప్రణాళికను (Charter of rights) ఒకదానిని అంగీకరిస్తూ ప్రకటించాలి.

పైకోర్కెలను అంగీకరించినప్పుడే ఉపాధ్యాయులలోని అసంతృప్తితొలగి శాంతియుతమైన మనస్సుతో తమసర్వశక్తులను విద్యాభివృద్ధికి వినియోగించగల్గుతారు. ప్రభుత్వం ఈ సత్యాన్ని ఎంత త్వరగా గ్రహించి ఆచరణలోపెట్టితే అంత త్వరగా మన విద్యావిధానం ముందుకు పోగల్గుతుంది.

## ప్రాథమికవిద్య - ప్రజాప్రభుత్వ ప్రథమబాధ్యత

**తిండి, బట్ట, ఇల్లు మొదలగు** వాటివలెనే ప్రాథమిక విద్యకూడ మానవుని కనీస అవసరాలలో వొకటి. మనదేశంలో ప్రాథమికవిద్యాభివృద్ధి ఎంతో జరగాలి. దేశంలో దారిద్ర్యం, నిరుద్యోగం తాండవిస్తున్నాయి. ప్రజలందరికీ తిండి, ఉద్యోగాలు కల్పించి జీవిత ప్రమాణాన్ని పెంపొందించాలంటే దేశం పారిశ్రామికాభివృద్ధి చెందాలి. కాని నిరక్షరులైన ప్రజలతో పరిశ్రమలు ఎలా ముందుకు పోగల్గుతాయి? పరిశ్రమలు వ్యాప్తిజెందాలంటే ప్రాథమికవిద్య అనివార్యంగా అభివృద్ధిజెందాలి. అందుచేతనే ప్రాథమికవిద్యను ప్రాథమిక పరిశ్రమ అనికూడ అంటారు.

దేశాన్ని కొల్లగొట్టుటే ఏకైకలక్ష్యంగా గలిగిన సామ్రాజ్యవాదులు పారిశ్రామికాభివృద్ధి నరికట్టినట్లుగానే ప్రాథమిక విద్యను వెనుకకు నెట్టారు. నూటికి 10 మందికి మాత్రమే అక్షరభాగ్యం లభించింది.

కాంగ్రెసు మంత్రులు పరిపాలన స్వీకరించారు. ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాలలో నిర్బంధ ప్రాథమిక విద్యవొకటి. దీనిని ఆచరణలో పెట్టితే తమబిడ్డలకు కాస్త అక్షరజ్ఞానం లభిస్తుందని ప్రజానీకం ఆశించింది. ఇంతవరకూ కాంగ్రెస్ మంత్రులు వచ్చాక రెండు బడ్జటులు గడిచాయి. నిర్బంధ ప్రాథమిక విద్యసంగతి తలచినవారేలేరు. 1947-48 బడ్జెటును చూస్తే ప్రాథమిక విద్యఅంటే ప్రజామంత్రుల కెంతశ్రద్ధఉన్నదో స్పష్టపడుతుంది.

గత సంవత్సరం ప్రాథమిక విద్యకు 4 కోట్ల 47 లక్షల రూపాయలు ప్రత్యేకిస్తే ఈసంవత్సరం 4 కోట్ల 20 లక్షలను తగ్గించారు అంటే 27 లక్షలు కత్తిరించారు. గత సంవత్సరం నిర్బంధ ప్రాథమిక విద్య ప్రవేశపెట్టుటకు 46 లక్షలు వినియోగిస్తే ఈ సంవత్సరం 22 లక్షలకు తగ్గించారు. నిర్బంధ ప్రాథమికవిద్య విషయం నానాటికి తీసికట్టుగా ఉన్నది. ప్రాథమికవిద్య కెక్కువ మొత్తాలను ఖర్చుపెట్టుటకు బదులు ఉన్నవాటినే తగ్గిస్తున్నారంటే ఆశ్చర్యంకాదా? అడ్వయిజర్ల కాలంలో ప్రతి జిల్లాలోనూ తాలూకాకు రెండు గ్రామాలు చొప్పున నిర్బంధవిద్యను ప్రవేశపెట్టారు. బీద విద్యార్థులకు ఉచిత మధ్యాహ్న భోజనాలనుకూడ యేర్పరిచారు. కాని ప్రజామంత్రులు అడ్వయిజర్ల కాలంలో బీదపిల్లల భోజన నిమిత్తం యిచ్చిన రు. 0-1-6 కూడ రద్దుచేశారు. అదేమిటని ప్రశ్నిస్తే అన్నిటికీ డబ్బులేదనే మంత్రం వల్లిస్తారు. మనస్సులో దీక్ష ఉంటే మార్గం కనిపించక పోతుందా?

జమీందార్లపైన, ధనికులపైన, పెట్టుబడిదార్లపైన, భూస్వాములపైన అధిక పన్నులు వేయడం ద్వారా ప్రభుత్వ ఆదాయాన్ని ఎన్నోరెట్లు పెంచవచ్చు. కాని ప్రభుత్వం పెట్టుబడి దారుల, జమీందార్ల లాభాలను ముట్టుకోకుండా ఆదాయం రమ్మంటే ఎలావస్తుంది?

కాంగ్రెసు ప్రభుత్వం సామ్రాజ్యవాదులు అనుసరించిన పంథానుండి మరలాలి. నిరక్షరాస్యతపై దాడి సాగించుటకు వయోజన విద్యాప్రచారానికి పూనుకోవాలి. నిర్బంధ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టి పిల్లలందరకూ ఉచితంగా చదువుచెప్పాలి. బీదపిల్లలకు ఉచితంగా పుస్తకాలు సప్లయి చేయుటయేగాక, కనీసం మధ్యాహ్న భోజన వసతులు ఏర్పాటుచేయాలి. నేడు స్కూళ్ళల్లో అనేకమంది ఉపాధ్యాయులు కావలసి వస్తున్నారు,

వీరందరికీ శిక్షణ ఇచ్చుటకు అనేక ట్రైనింగ్ కళాశాలలు, స్కూళ్ళు తెరవాలి. ఉపాధ్యాయవృత్తిని ప్రోత్సహించుటకు వారివేతనాలను కోగడ సూచించిన విధంగా పెంచాలి. దీనికంతటికీ సోవియట్ రష్యా మొదలగు దేశాలలోవలె ౕ సంవత్సరాల ప్రణాళికను ఒకదానిని తయారుచేసి, ఆకా లంలో ఒకప్లాను ప్రకారం పనిసాగించాలి. ప్రజలమీద విశ్వాసంవుంచి ప్రజలకొరకు పట్టుదలతో పనిసాగిస్తే యేకొరతా అడ్డురాదు. కాంగ్రెసు మంత్రులికనైనా తమ యెన్నికల వాగ్దానాన్నిగూర్చి తీవ్రంగా ఆలో చిస్తారా? ప్రాథమిక విద్యను వాయిదావేయడమంటే జాతిఅభ్యుదయాన్నే వాయిదావేయడం.

## ఉపాధ్యాయుల జాతీయ బాధ్యత

పోరాటంద్వారానే తమహక్కులు సాధించుకోగలమని ఉపాధ్యా యులు గుర్తించుట చాలాసంతోషం. సామ్రాజ్యవాద ప్రభుత్వముమీద ఉన్న భ్రమలన్నీ వదిలించుకొని తమ సంఘ శక్తిమీదనే ఉపాధ్యాయులు ఆధారపడటాన్ని దేశభక్తిగల ప్రజానీకమంతా హర్షిస్తుంది. కాని తమ హక్కులకొరకు పోరాడే ఈ సమయంలో ఉపాధ్యాయులు తమ బాధ్యత లనుగూడ గుర్తించుట అవసరము.

జాతి భావి భాగ్యోదయం అంతా మీ మీదనే ఆధారపడి ఉన్నదని గుర్తించాలి. భవిష్యత్తు జాతిని నిర్మించుటలో సర్వశక్తులనూ ధారపోయు టకు మీరు మీసంసిద్ధతను వెల్లడించాలి.

కేవలం జీతాలనెక్కువ జేసుకొనుటకే ఆందోళనసాగిస్తే ప్రజా సహకారం పొందజాలరు. జాతీయ విద్యావిధానముకొరకు మీరు ఎంత ఎక్కువగా ఆందోళనసాగిస్తే ప్రజల సహకారం అంతఎక్కువగా పొంద గల్గుతారు.

ఇంతవరదాకా ప్రజాజీవితానికి అభివృద్ధిదాయక ఉద్యమాలకు దూరంగా వున్నారు. దేశసేవాతత్పరత ఉపాధ్యాయుల - ప్రజలమధ్య వున్న అగాధాన్ని పూడ్చగలుగుతుంది.

ఉపాధ్యాయుల జీతాలు ఎక్కువచేయుటకు బడ్జెటులో అవకాశాలు లేవనీ, ప్రజలపై పన్నుభారం ఎక్కువౌతుందనీ, ప్రభుత్వం సమాధాన మిచ్చింది. తమకిష్టంలేని పనినిచేయకుంటే ప్రజలనడ్డంపెట్టి తప్పించుకొను

టలో సామ్రాజ్యవాదులు ఆరితేరినవారు. ఉపాధ్యాయులజీతాల నెక్కువ చేయుటకు ప్రజాభిప్రాయాన్ని వ్యతిరేకించి తద్వారా ప్రజలనుండి ఉపాధ్యాయులను చీల్చుటకు ఇదొక మార్గంగా సామ్రాజ్యవాదులు అవలంబిస్తూవచ్చారు. కాని, ఈమార్గాన్నే నేడు కాంగ్రెసు మంత్రులు అనుసరించడం శోచనీయం. కొందరు ఉపాధ్యాయులు ప్రభుత్వము చెప్పే ఈకుంటి సాకును అర్థం చేసుకోకుండా సంకుచిత దృక్పథంతో విద్యార్థుల జీతాల నెక్కువ చేయాలని సూచిస్తున్నారు. ప్రజలీవరకే పన్నుల భారంవల్ల, తమ బిడ్డల స్కూలుజీతాలు, చదువు ఖర్చులు భరించలేక క్రుంగిపోతున్నారు. ఈపరిస్థితుల్లో విద్యార్థుల జీతాలు ఎక్కువ జేయాలనడం ప్రజల శ్రేయస్సుకే విరుద్ధమైనదికాదా? దీనివల్లసామ్రాజ్యవాదుల కోర్కె యీడేరదా? ప్రభుత్వ ఆదాయాన్ని యెక్కువజేసి ఉపాధ్యాయుల జీతాలు పెంచాలంటే జమీందార్లు, భూస్వాములు, పెట్టుబడిదారులపై అధికపన్నులు వేయవచ్చు. ఉపాధ్యాయులు తమ సమస్యా పరిష్కారాన్ని, ప్రజాక్షేమాన్ని దృష్టిలోనిడికొని ఆలోచించాలి.

నేటి బానిస విద్యావిధానంక్రింద ఉపాధ్యాయులకు విముక్తిలేదు. జాతీయ విద్యావిధానంక్రిందనే ఉపాధ్యాయుడు సౌఖ్యప్రదమైన నూత్న జీవితాన్ని నిర్మించుకొని గౌరవ ప్రతిష్ఠలతో తన పవిత్ర ధర్మాన్ని నిర్వహించగలుగుతాడు.

కష్టజీవులైన కార్మిక, కర్షకులే ఉపాధ్యాయుల కష్టాలను గుర్తింపగలుగుతారు. అజ్ఞాన-అవిద్యలలో మునిగి తేలుతూఉన్న ప్రజలే జాతీయ జీవనంలో ఉపాధ్యాయుని పాత్ర నర్థం చేసుకోగల్గుతారు. ప్రజలపై విశ్వాసముంచి ప్రజాసాయంతో పోరాడితే మీహక్కులను సాధించుకోగల్గుతారు.

ఇంతవరదాకా విద్యార్థుల పోరాటాలను మీరు వ్యతిరేకిస్తూ వచ్చారు. జాతీయ పోరాటాలలో విద్యార్థులు అగ్రగామిగా నిలచిపోరాడి అనేక త్యాగాలు చేశారు. బానిసవిద్యావిధానానికి వ్యతిరేకంగా విద్యార్థులు సాగించిన పోరాటాలను హైస్కూలు ఉపాధ్యాయులు వ్యతిరేకించారు. నేడు ఉపాధ్యాయులు, విద్యార్థులు ఒకే బానిస విద్యావిధానంక్రింద సమానంగా బాధపడుతున్నారు. బానిస విద్యావిధానాన్ని తుడిచివేయడం ఇర్వురికీ శ్రేయస్సే. అందుచే సామ్రాజ్యవాద విద్యా విధానానికి వ్యతిరేకంగా

సాగించే పోరాటంలో విద్యార్థులను మీయొక్క సహచరులుగా గుర్తించాలి.

దేశభక్తియుతమైన విద్యావిధానంకొరకు ప్రజల, విద్యార్థుల సహకారంతో మీరు పోరాటాలు సాగించాలి.

## ఉపాధ్యాయుల కోర్కెలను ప్రజలు, విద్యార్థులు బలపర్చాలి

ఉపాధ్యాయుడు జాతియొక్క రూపురేఖలను దిద్దే శిల్పి. ఆకలి బాధతో అలమటిస్తూ నిరంకుశ అధికారులక్రింద నలిగిపోతూ మన బిడ్డలకెలా విద్యగరిపి వారి సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడగల్గుతాడు? ఉపాధ్యాయుని దుస్థితి జాతికే దుస్థితి. ప్రస్తుత విషాదపరిస్థితులనుండి ఉపాధ్యాయుని తప్పించి తగిన ఆర్థికప్రతిపత్తి నొసగుట మనందరి ధర్మం. అప్పుడే తన సర్వశక్తులను ధారవోసి సరియైన బాలబాలికలను తయారు జేయగలడు. అందుచే ప్రజలంతా ఉపాధ్యాయుల పోరాటం తమ పోరాటంగా గుర్తించి, వారిహక్కులను బలపర్చాలి. ప్రజలు - వ్యిదార్థులు - ఉపాధ్యాయులు ఐక్యమై బానిసవిద్యా విధానానికి స్వస్తిజెప్పి ప్రజా విద్యావిధానాన్ని నెలకొల్పాలి.

ప్రకాశ్ ప్రెస్, బెజవాడ 3.18/సి 2000 కాపీలు 17—4—47

విజ్ఞాన సముపార్జనకు

# మంచి అవకాశం

| | అసలుధర | తగ్గింపుధర |
|---|---|---|
| చిటగాంగు విప్లవవీరులు | 1-0-0 | 0-8-0 |
| నేనెలా కమ్యూనిస్టునయ్యాను | 0-6-0 | 0-2-0 |
| వర్కింగు కమిటీకి జవాబు 3 భాగములు | 2-0-0 | 1-0-0 |
| విశాలాంధ్రలో ప్రజారాజ్యం | 0-8-0 | 0-4-0 |
| అంతిమపోరాటానికి కదలిరండు | 0-10-0 | ఉచితం |
| అందరికీ ఉద్యోగాలు | 0-4-0 | ఉచితం |
| అందరికీ తిండి | 0-4-0 | ఉచితం |
| పండించేవారికే పొలం | 0-4-0 | ఉచితం |
| మేము కాంగ్రెసులో ఎందుకుచేరలేదు | 0-4-0 | ఉచితం |
| కమ్యూనిస్టువ్యతిరేకుల నగ్నస్వరూపం | 0-10-0 | ఉచితం |
| భారతనావికుల సమ్మె | 0-4-0 | ఉచితం |
| | 6-6-0 | 1-14-0 |
| పోస్టేజి— — — | | 0-10-0 |
| | | 2-8-0 |

పోస్టేజితో రెండున్నర రూపాయలు పంపిశే ఈ పుస్తకాలన్నీ పంపబడతాయి. ఇందులో మీవద్దనున్న పుస్తకాలు మినహాయించి మిగిలిన వాటికే వ్రాసి మీపెట్టె పూర్తిచేసుకోండి. వేరువేరుగా పుస్తకాలు కొనదలచినవారు అసలుఖరీదు రూపాయిచేసే పుస్తకాలకు 0-4-0 పోస్టేజి కూడ కలిపి పంపాలి. పూర్తిపెట్టె కొనేవారికే ఉచితపుస్తకాలు.

ప్రజాశక్తి ప్రచురణాలయం, బెజవా(